# చైతన్య కిరణాలు

## (గేయసంపుటి)







రచన:

వల్లభాపురపు దేవదానం.

ప్రథమ ముద్రణ :
ఏప్రియల్ 1993

ప్రతులు : 2000



ముద్రణ :
శ్రీ తిరుమల ప్రింటర్స్
షరాఫ్ బజార్, తెనాలి.

వెల : రు. 8-00 లు

ప్రతులకు :
వల్లభాపురపు దేవదానం
ఉపాధ్యాయుడు,
దుగ్గిరాల - 522330
దుగ్గిరాల (మండలం)
గుంటూరు (జిల్లా)

# అంకితం



"చైతన్య కిరణాలు"

నాకు జన్మనిచ్చిన
జననీ జనకులు
స్వర్గీయులైన-
మరియమ్మ, జఖరయ్యగార్ల
దివ్యస్మృతికి "అంకితం"
అది నా జీవన సౌభాగ్యానికి
"శాశ్వతం"

-కుమారుడు

**వి. దేవదానం**

# కృ తి ప తి



శ్రీ వెంకట కృష్ణారావు మహాశయా !

నన్నొక కృతికర్తగా గుర్తించినారు నా కావ్య కన్యకు కృతిభర్తగా నిలిచినారు. దయామూర్తిగా కొనియాడబడుచూ దానకర్తగా వెలుగొందు చున్నారు. మరువలేనండి మిమ్మెప్పుడు నేను మరువకండి నన్నెప్పుడు మీరు.

- వల్లభాపురపు

వంకరు హాకీ సరస్వతి-
శంకల్ బాపిన - కృతిపతి
"జంపాలాఖ్యా"
వేంకట కృష్ణారాయా !
శంకమ్ముగ మనుము భువిని
బుధనుత మతివై !

"మ ధు ర క వి"
శ్రీ నూతక్కి

# నా దృష్టిలో...

నా పూర్వ విద్యార్థి శ్రీ వల్లభాపురపు దేవదానం ఆదర్శప్రాయుడైన ఉపాధ్యాయుడుగనేకాక, మంచి గేయ కవిగా రూపొందడం గర్వకారణం. ఆయన రచించిన చైతన్య కిరణాలు, గేయసంపుటిని ఆ మూలాగ్రహం చదివి ఆనందించాను. పుట్లు పుట్లుగా పట్టెడు కొరుకుడు పడని, వాడుకలో లేని పదాలతో పాఠకులకు భావాన్ని అర్థంకానీయక, విసిగించే కవి పండితకోటికంటె, వాడుక భాషలో చిన్న చిన్న పదాల్ని పొందిక చేసి గేయాలుగా తీర్చిదిద్దిన శ్రీ దేవదానం ధన్యజన్ముడు.

మంచి మనసు గలవాడు
వంచితులను విడనాడు
సత్యము నిలలో స్థాపన జేయ
నిత్యము నిజముగ పోరాడు" అని తన 'జీవన పథం'లో వక్కాణించి సామాజిక స్పృహగల ఉపాధ్యాయునిగ శ్రీ దేవదానం నిరూపించుకొన్నాడు.

'ఉపాధ్యాయుడు' అనే శీర్షిక క్రింద
ఉత్తేజమందు నీ వృత్తియందు
ఉత్సాహమొనర్చు విద్యార్థులందు
ఆర్జించు విద్యాధనము మెండుగా' అని సాటి ఉపాధ్యాయ లోకానికి చాటిచెప్పిన మేటి గేయ రచయిత-

పండుగలను గురించి, పేదరికాన్ని గురించి, రైతు బాధలగురించి చిత్రించిన యీ కవి రచనలు విద్యార్థులకు మార్గదర్శకాలు శ్రీ దేవదానము అనేక రసవత్తర కావ్య కుసుమాలను తెలుగుజాతి కందీయగలరని ఆశిద్దాంనిరీక్షిద్దాం.

కొలకలూరు

14-4-93

**టి. జి. సంజీవరావు**

జిల్లా విద్యాశాఖాధికారి (రిటైర్డ్)

# అభినందన

చైతన్య కిరణాలు అను గేయ సంపుటిని మా దుగ్గిరాల మండలములో గల కఠెంరాజుకొండూరు యం. పి. పి. ప్రాథమిక పాఠశాలలో పనిచేయుచున్న ఉపాధ్యాయుడు శ్రీ వి. దేవదానం సామాజిక స్ఫూర్తితో తన ఖాళీ సమయముతో సద్వినియోగము చేసికొని రచించిన ఈ గేయ సంపుటి ఎంతో ప్రశంసనీయము.

ఈ చిన్న గేయసంపుటి మానవుని మూర్తిమత్వమును చాటి చెప్తున్నది. మానవుని సహజ లక్షణములైన అరిషడ్వర్గములను వెలికితీసి మన కన్నులముందు చిరుదివ్వెగా వెలిగించి, ప్రజతుకుబాటలో బాసటగా నిలిచేరు. ప్రతి చిన్న అంశమును పెద్ద మనస్సుతో చూడమని చైతన్యకిరణాలు ప్రసరించాయి.

సరళమైన భాషలో తన భావాన్ని వ్యక్తీకరించారు. ముమ్ముందుగూడా ఈ ఉపాధ్యాయుడు ఉపాధ్యాయ లోకానికి ఆదర్శప్రాయుడుగానుండి సమాజానికి తన సేవల నందించగలడని ఆశిస్తూ-

యం. కోటేశ్వరరావు
మండలాభివృద్ధి అధికారి
దుగ్గిరాల మండలం
దుగ్గిరాల

# ప్రగతి సోపానాలు - చైతన్య కిరణాలు!

సమసమాజ నిర్మాణంలో వస్తున్న అస్తవ్యస్త కవిత్వ ధోరణులలో పెల్లుబికించు చైతన్య కిరణాలు, విజ్ఞులు, ప్రాజ్ఞులు రసజ్ఞులు మెచ్చు రీతిలో ఇందులో రచయిత సృష్టించిన ప్రతి గేయచంద్రిక ఒక ఉదాత్తత కల్పించుచున్నది. నేటిసమాజంలో ప్రగతి సృష్టికర్త రచయిత ఈ రచయిత తన వంతు కర్తవ్యంగా, ధ్యేయంగా ఎంతో శ్రమ తీసుకొని రచించిన ఈ చైతన్య కిరణాలు జాతి ప్రగతిని సోపానాలు రచయిత వృత్తి రీత్యా ఉపాధ్యాయుడుగా తన వాణిని, ప్రకృతిరీత్యా ఒక కవిగా తన వాణిని, బాణిని, ఈ చైతన్య కిరణాలద్వారా నిరూపించారు. ఈ గేయ సంపుటిలో ప్రతి గేయం ఒక చల్లని కిరణంగా, మరొక చైతన్య కిరణంగా, రేపటి మణి దీపంగా ఆ చంద్రార్కం నిలుస్తుంది వీరి రచయిత శత సహస్ర వసంతాలు దేవదానం పట్టింది బంగారంగాను, ముట్టింది ముత్యంగాను, వీరి ప్రతి రచన కళా జగత్తులో మరో సృష్టి కర్తగా, భవితకు ఆదర్శ కవిగా, చైతన్య అక్షర లక్షలు పండించిన ఈ రచయితకు శత కోటి దేవతల ఆశీస్సులు నిండుగా మెండుగా దండిగా కొండంత అండగా ఉండాలనీ ఆశీస్తు ఆకాంక్షిస్తూ-

మీ


**ఉత్పల వరదరాజు**

సినీ రచయిత

అధ్యక్షులు రాష్ట్రీ మనోరంజనీ ఆర్ట్స్

హొన్నూరు.

# అభినందన చందనాలు

కవి దేవదానంగారు సాహితీకృషీవలుడు సహృదయులు వారు రచియించిన గేయాలు కిరణాలుగా నవయుగంలో కే శిఖరాలనందుకోవాలని కాంక్షిస్తున్నాను. వీరి ప్రతి రచనలో ఒక ప్రత్యేకత ఒకవిశిష్టత స్పష్టమౌతుంది. శ్రీ దేవదానంగారు రచించిన ఈ గేయ సంపుటి సాహితీనందనంలో సాహితీ ఘుభాళింపులను నింపుచూ వారికి సాహితీ యశస్సును వన్నె చిన్నెలు ఎన్నెన్నో చూపస్తుంది.

"ఈ సంపుటి వారికి నా అభినందనలు"

**పెద్దిటి యోహాను**

వ్యవస్థాపకులు

పద్మభూషణ్, గుర్రం జాషువ, కళాపరిషత్ దుగ్గిరాల.

## భవితకు బంగరుబాట...

మిత్రుడు హితుడు సన్నిహితుడు శ్రీ వల్లభాపురపు దేవదానం కలంనుండి జాలువారిన కవితా వెన్నెల సోనలు ఈ "చైతన్య కిరణాలు" గేయసంపుటి సమ సమాజ నిర్మాణానికి తనవంతు కర్తవ్యంగా కవిగా సరిక్రొత్త మార్పుకోసం వీరి తపన ప్రతి గేయములో గోచరిస్తుంది. వీరు ఇంకా ఎన్నో మరెన్నో రచనలు భవితకు బంగరు బాట అవ్వాలని చైతన్యపు విరులు నింపాలని ఆశిస్తా !

మీ

**కొండ్రు విక్టరు కళ్యాణరావు**

దళిత వెల్ఫేర్ సొసైటి

దుగ్గిరాల ప్రసిడెంటు

దుగ్గిరాల

15-4-93

# ఆశీస్సులు

తీయ తీయనైన తేటతెనుంగున
అలతి పద్యజాలములను కూర్చి
శారదాంబ మురియ చైతన్య కిరణాలు
ప్రసరణమును చేసె రసమయుండు!

వల్లభాపురంపు వరదేవదాసను
సుకవి రంజితుండు సభలయందు
సరసభావుడయ్యు వరకాంత గుణుడయ్యు
పృథివి మనుసుగాక బుధులు మెచ్చ!
అమరవాణి ప్రజకు నందించు కవియయ్యె
వర్ధమానుడగుచు వసుధమనలు:

"మ ధు ర క వి"
శ్రీ నూతక్కి

# నా మిత్రుడు

నాకు చిరపరిచయుడు సౌమ్య మనస్కుడు అయిన "శ్రీ వల్లభాపురపు దేవానందగారు" "చైతన్య కిరణాలు" అనే గేయ సంపుటిలోని లోతు పాతులను గూర్చి యభిప్రాయ మీయవలసినదిగా కోరుట నా యదృష్టము గానే భావించుచున్నాను. సామాజిక చైతన్యాన్ని, సాహిత్యపరంగా సమాజాన్ని చైతన్యవంతం చేయుటలో వారు సఫలీకృతులైనారు. అంబేద్కరుని గురించి అన్నా! అంటూ తన అవ్యాజానురాగాలు తన నాయకుని పట్ల ప్రదర్శించుకొన్నాడు. ఇది మహోదాత్తమైన గుణము.

ఈ రచయిత ప్రథమ ప్రయత్నమే ఫలవంతమైనది. ఇంకా అనేకానేక గ్రంథ రాజములను వ్రాసి ప్రజలకందిస్తారని ఆశీర్వదిస్తున్నాను.

వసుమూరి ప్రభాకరరావు
సీనియర్ తెలుగు పండిట్
ఉన్నతపాఠశాల- మున్నంగి

# నా మాట

నాలోని భావాలు

నలువురకు తెల్పాలని

కవిత వ్రాయతలంచి

కలము చేబూని

చిట్టి చిట్టి కవితలను

చిన్నలకు, పెద్దలకు

నీతి - నిజాయితీలు

నిత్య జీవితములో

జ్యోతులుగా నుండునటుల

చైతన్య కిరణాలు ప్రసరించు

ఓం

- వల్లభాపురపు

# కృతజ్ఞతలు

నా గేయ సంపుటిని ప్రోత్సహించిన గురువర్యులు- మున్నంగి ఉన్నత పాఠశాల సీనియర్ తెలుగు పండితులు నగు శ్రీ పరుచూరి ప్రభాకరరావుగారికి 'మధుర కవి' శ్రీ నూతక్కి అబ్రహాముగారికి 'నవన కవి' శ్రీ పినపాటి [illegible]గార్లకు నా కృతజ్ఞతలు.

నా కృతి కన్యకు భర్తయైన శ్రీ జంపాల వెంకట కృష్ణారావు (మాజీ [illegible] మండలాధ్యక్షులు) వారికి ప్రత్యేక కృతజ్ఞతలు. ఇంకనూ నన్ను ప్రోత్సహించిన కవులకు, పండితులకు, హితులకు, బంధుమిత్రులకు సోదరోపాధ్యాయులకు నా కృతజ్ఞతలు.

[illegible] నేనడిగినంతనే తమ అమూల్యాభిప్రాయము లందించిన విజ్ఞ మహాశయులకు నా కృతజ్ఞతాభినందనలు. సకాలంలో ముద్రించి అందించిన శ్రీ తిరుమల ప్రింటర్స్, తెనాలివారికి నా ధన్యవాదములు.

- చైతన్య కిరణాలకర్త

# 1. ఆదర్శం

## ఉపాధ్యాయవాణి ప్రచురణ ఫిబ్రవరి మాసపత్రిక 1993

వీడ్కోలు పలుకుదాం
గత సంవత్సరానికి
స్వాగతం పలుకుదాం
ఈనూత్న వర్షానికి

తెల్పుకుందాం శుభాకాంక్షలు
పరస్పరంగా సౌభ్రాతృత్వముతోను
సమత మమతల సంఘీభావ
సువిశాల హృదయాలతోను

ప్రవేశించాము పందొమ్మిదివందల
తొంబది మూడవ వత్సరములో
ప్రత్యేకత ఎంత దాగివుందో ?!
ఈనూత్న సంవత్సరంలో !

గత డిసెంబరు నెల ఆరును
జ్ఞప్తికి తెచ్చుకొన్న మనం
మత సామరస్యాన్ని మరచినట్లే
మానవత్వాన్ని మంటగలిపినట్లే

మతము ముఖ్యముకాదు మనిషికి
మమతే ముఖ్యము ప్రతి మనస్సుకి
మానవత్వంలో మార్పు తెద్దాం
మమతను పెంపొందించుకుందాం.

సాక్షిగా గడుపలేక పోయాం
గత లీక్ష సంవత్సరాన్ని !
సామరస్యంగా గడుపుకుందాం
ఈ సాధారణ సంవత్సరాన్ని !!

ఆదర్శం అందరికీ ముఖ్యం
ఆవేశం అన్ని విధాలా నష్టం
ఆదర్శంగా మనముందాం
ఆవేశాన్ని తగ్గించుకుందాం

**1993 నూతన సంవత్సర శుభాకాంక్షలతో**

## 2. ఉగాది

**1993 నూతన తెలుగు వత్సర శుభాకాంక్షలతో**

వచ్చిందండోయ్ ! వచ్చింది !
ఉగాది పండుగ వచ్చింది
తెచ్చిందండోయ్ తెచ్చింది
శ్రీముఖనామ వత్సరం తెచ్చింది

జ్యోతిష్కులకు జీవనాధారం
పంచాంగకర్తలకు పరమానందం
అందరకు అందుబాటు కావాలని
కోరుకొందాం మనమందరం

వేము, వగరు, పులుపు, తీపి
మొదలగు మిశ్రమాన్ని

భక్తితో రుచి చూస్తాం
ఈ పండుగ దినం

ఈ రుచులన్నీ మిళితమైనట్లే
మన జీవితం ఈలాగే వుంటుందని
నిదర్శనంగా గుర్తించాలి
మనమందరం ఏనాటికైనా !

తెలుగు జాతికి ప్రియమైన
పండుగదినం, ఈ దినం
అందుకే తెల్పుకుందాం
పరస్పరంగా సాభ్రాతృత్వంతో
"శుభాకాంక్షలు ఈ పర్వదినం"

## 3. ప్రధానం

ఆత్మశుద్ధి ప్రధానం
దుష్టబుద్ధి ప్రమాదం
పరిశీలించు మిత్రమా !
ఫలితము గ్రహించుమా !!

## 4. మంచి

నమ్మి నమ్మి నామాటనమ్మని
మాటిమాటి కంటాదు కొందరు
మనిషి తత్వమెట్టిదోనని
మనిషి మనిషినే నమ్ముటకు

మనిషి భయపడుచున్నాడు
నమ్మవద్దు మనిషిని
మాటలను బట్టి
నమ్ముట మంచిది
మనిషిలోని "మనస్సును" బట్టి

## 5. ముద్దు

కుత్సితుండు సంకుచిత బుద్ధితోనుండు
నక్కలు చెప్పుడు చక్కగానుండు-
మనిషి మరణించవచ్చు
మంచి చావబోదు
వంచనకు తప్పక
ఓటమన్నది కలదు
పెద్దలు చెప్పిన
మంచి సూక్తులివి
హద్దులు దాటక
నమ్మి నడచిన
ముద్దుగ నుందురు
ముద్ద మందారములా !!

## 6. నేర్పు - ఓర్పు - తీర్పు

నేర్పుతో చేసిన పనిని
ఓర్పుతో పరికించిన

తీర్పులో నెగ్గగలవు
నేర్పు ముఖ్యమని గ్రహించగలవు
నేర్పు - ఓర్పు - తీర్పులకు
ప్రధాన పాత్రధారుడవై
ప్రయోగాత్మక క్రియలతో
ప్రజలకుపయుక్తమైన
పనులెన్నో చేయుమోయి
ప్రజ్వరిల్ల, లే, లెమ్మోయి ! !

## 7. ఓ నేస్తం

నేస్తం ! నేస్తం ! ! ఓ నేస్తం ! ! !
ఒప్పుకుంటావా ఈ వాస్తవం
నెలకు జీతంసంపాదిస్తున్నావు
నెలజీతము కొఅకు ఎదురుచూస్తున్నావు !

ఎంత ఖర్చుచేస్తున్నావు ?
ఎంత అప్పుచేస్తున్నావు ?
ఎంత తప్పుచేస్తున్నావు ?
ఎంత వృథాచేస్తున్నావు ? !

ఖర్చు తగ్గించి ఖచ్చితంగా జీవించు
అప్పుచేయుటకు అలవాటుపడవద్దు
అప్పుచేయుట పెద్దముప్పని గమనించు
హద్దు అదుపుదప్పి పెద్దలే జీవిస్తే !
ముద్దు లొలుకు బాలలేరీతి మెలిగెదరు ! ?

హాస్యం విడకనివ్వు బుద్ధిగా నడచుచూ
ఒక్కరిగా జీవించు ఓ నేస్తమా నీవు
ఓర్పుకలిగి జీవించు యికముందునీవు ! !

## 8. స్నేహం - బంధుత్వం

సృష్టిలో తీయనిది స్నేహం
సృష్టిలో తీయనిది బంధుత్వం
స్నేహం చెరిగిపోని బంధం
బంధుత్వం తరిగిపోని సంబంధం

ప్రేమాభిమానం స్నేహితులలో
స్నేహానురాగం బంధువులలో
కలుగుచున్న ఈరోజుల్లో
స్నేహ బంధుతత్వం తెలుసుకో !
తెలివిగా "సమాజములో" మసలుకో !!

## 9. సూక్తులు

చెప్పుడు మాటలు వినవద్దు !
చెప్పకూడనివి చెప్పొద్దు !!
చూడకూడనివి చూడొద్దు !
చేయకూడనివి చేయొద్దు !!

వినదగు మాటలు విను
చెప్పతగినవి చెప్పు

చూడతగినవి చూడు
చేయతగినదే చేయి !

అందరు వినదగు మాటలివి
పెద్దలు కట్టిన కోటలివి
ఒద్దికతో పాటించినవారికి
తరగని చద్దిమూటలివి

## 10. కవిత

కాలాను గుణముగ
కవిత వ్రాయవలె
కర్త, కర్మ, క్రియలతో
కవికంతగా పనిలేదు
కాలమే కవితకాధారం !
కాలాను గుణముగ
కమ్మని భావాలతో
కనువిప్పు కల్గించు
ఘట్టములు చిత్రించు
కవితలందించు
కర్తవ్యం బోధించు.

## 11. సన్యాసి - సంసారి

సన్యాసీ ! నీ జీవితం శ్రేయోదాయకం !
సంసారీ ! నీ జీవితం శ్రమదాయకం ! !

సన్యాసి సాధించు సత్కర్మఫలం
సంసారి భరియించు సంసారభారం
శాంతి చేకూర్చు సన్యాస జీవితం
భ్రాంతి చేకూర్చు సంసార జీవితం.

## 12. జీవనపథం

### రేడియో ప్రసారము 1986

మంచి మనస్సుగలవాడు
వంచితులను విడనాడు
సత్యము నిలలోస్థాపన జేయ
నిత్యము నిజముగ పోరాడు

మంచీ - చెడులు మనలోనున్నవి
ఎంచిచూడ యిది నిజము
మానవాళికి మంచినిగూర్చుటే
మనిషిగ నీ ధర్మము

మానవుడే యిలదానవుడైతే
మంచికి మనుగడకలదా !
నిజమానవునిగ నిడచుకో
హాజమన్నది నేడే విడచుకో

ఎండమావులను ఎరుగక నీవు
మొండిగ ముందుకు నడువకు
అడుగడుగున సుడిగాలులు ఎన్నో
వెంటాడును నిన్ను నిమరువకు !

గమ్యము చేసి బాటసారిగా
నడుపకు జీవితరథము
మర్మము ఏది ధర్మము నెరిగి
నడచుమే జీవనరథము.

## 13. కవిత్వము

నేస్తం ! నేస్తం !! ఓ నేస్తం !!!
కవిత్వమంటే తెలుసా ?
నే విన్నవిస్తా ఆలకిస్తావా !
కవిత్వమంటే-

కన్న వాటిని
విన్న వాటిని
త్వరితరీతిలో
ముచ్చటించుటే
కవిత్వమంటాను

కవికుండవచ్చు
కోర్కెలెన్నెన్నో ! గాని
కవికుండాలి
కమనీయ హృదయం
కనువిప్పు కల్గించు
కరుణగల సుగుణం.

## 14. నిజాయితీ

ప్రజా వైద్యశాలలు స్థాపిస్తారెందరో !
ప్రజలను దోచుకు తింటారు కొందరు
ప్రజలకు న్యాయం చేకూర్చువారెందరు !
ప్రజారాజ్యములో, ప్రజావైద్యశాలల్లో
ప్రజలకు న్యాయంచేకూర్చుటే రాజ్యాంగవిధానం
నీ సేవకు చెందేనో నిర్ణయించుకో
మానవసేవయే మాధవసేవగా గుర్తించుకో !
నిష్పక్షత నీ పొరుగువార్ని ప్రేమించుట నేర్చుకో
నీ ప్రతిభను ప్రజలకు కనపర్చుకో !
అప్పుడందుకోగలవు అవార్డులెన్నెన్నో !!

## 15. ముఖ్యం

తెలివితేటలు ఒకరిసొత్తు కావు
తెల్సుకొనవచ్చు వారి అభిరుచినిబట్టి.
విద్యను ఆర్జించుటలో
ప్రతిభకు సానపెట్టి
ప్రతి వ్యక్తి నిలవాలి
ప్రతిభకు ఫలితమొందాలి.
విధిగా పాటించాలి
వినయ విధేయతలు
విద్యార్థనము కొఱకై విద్యార్థి.

తెలివిని పెంచుట
మంచిని ఎంచుట
చెడును త్రెంచుట
వెలుగును పంచుట
కర్తవ్యం గుర్తించుట
మంచివారి లక్ష్యం
మనుగడకే ముఖ్యం.

## 16. నవ్వు

కపట బుద్ధితో
కనులు గప్పుచు
చెంగు చెంగున
గంతు లేయుచు
ముసి ముసి నవ్వులు
నవ్వకు మెపుడు
నిను వెంటాడుచునే
నీ పగవారుంటారని
నీవెప్పుడు మరువకు
చిరునగు మోముతో
సిరులు గురిపించుచూ
చిరు చిరు నవ్వులు నవ్వి
ప్రగతి ప్రపంచానికి పవిత్రుడవై నువ్వు !

## 17. ఆహ్లాదం

రాగం రాగం రాగం
రమ్యమైనదే రాగం
అనురాగం అనురాగం
ఆత్మీయత కలదే అనురాగం
అనురాగముతో
ఆలపించినరాగం
అనుభవించుటే
ఆహ్లాదం

## 18. వాణి

చల్లని వెన్నెలకాంతిలో
కవితామతల్లి ఒడిలో
తనువు మరచి తలపులుపొంగ
కవితాగీతికలెన్నో
కలహంస భంగిమలా
కలకాలముండు నటుల
దివ్యపుటలను వ్రాయమంటుంది
"భారత విజ్ఞానవాణి"
కార్మిక కర్షక బాధలెన్నో
సాజమాన్యయాతనలెన్నో
సాధించిన చైతన్యాలెన్నో

కంటికి కన్పించుకీతీగ
వ్రాయమంటుంది "కార్మికకర్షకవాణి"
బాలల మనుగడను భాసించే
బాలల గేయాలెన్నెన్నో
బాలల భావితరాల
బంగరు బాటల వ్రాత రేకలు
భారత జాతికందించ
వ్రాయమంటుంది "దివ్యవాణి"
అన్ని సంఘాలు హర్షించుకీతీగ
అధర్మాలను ఎదుర్కొంటూ
ఆదర్శాలను అందుకొంటూ
అధ్యాపకుల అగచాట్లెన్నో
వ్రాయమంటుంది "ఉపాధ్యాయవాణి"
భారతదేశ పౌరునిగా
భారతజాతి ప్రగతికొఱకు
దేశసౌభాగ్యము నిల్పుకొనుటకై
దేశభక్తి గేయాలెన్నో
వ్రాయమంటుంది "నా అంతర్వాణి".

## 19. నిజం

పేదవారి బ్రతుకు
పీడిత బ్రతుకు

కలవారి బ్రతుకు
కలిమి పెంచెడి బ్రతుకు
మధ్యతరగతి బ్రతుకు
మందకొడి బ్రతుకు

ఎవ్వరికి వారే బాధలొందుదురు
పేదవాడు మధ్యతరగతివారినిగాంచి
మధ్యతరగతివాడు కలవారినిగాంచి
గుటకలు మింగుచు బ్రతుకుచుందురు.

ఎవ్వరికివారే దాషించుకుంటారు
ఎంత సంపాదించినా తృప్తిపడకుంటారు
ఎంత ఖర్చు చేసినది చెప్పలేకుంటారు
ఏమిటో ఈ మానవ నైజం!
ఎవ్వరికీ తెలియకున్నది దీనిలోని నిజం!

## 20. ప్రజానాయకులు

### రేడియో ప్రసారం 1986

ప్రజానాయకులం మేమేనంటూ
ప్రజాసేవకే పుట్టామంటూ
ప్రజలకు న్యాయం చేకూర్చుతామంటూ
ప్రజాసేవయే మా ప్రథమకర్తవ్యమంటూ
ప్రతిజ్ఞలెన్నో పలుమారులు పలుకుచు
ప్రజలను దోచుకు తినేటందుకు
ప్రజా ప్రతినిధులుగ మమ్మెన్నుకోమనే

ప్రభుత్వాలెందరో పుట్టారీదేశంలో
ఆ ప్రభుత్వాలకే పెత్తనమిస్తే !
ప్రజలుపడే పాట్లెన్నో !!

## 21. పేదవాడు - కలవాడు

పేదవాడు తప్పుచేస్తే
దండించు తారు
కలవాడు తప్పుజేస్తే
ఒప్పుగా భావించుతారు

పేదవాడు దండము పెట్టినా
దండనకు గురౌతాడు
కలవాడు కలిమి వెదజల్లి
కప్పిపుచ్చుకుంటాడు !!

కలవాడు కొందరు
పేదవానిని అడ్డుపెట్టుకొని
పాడుపనులెన్నో చేయించుతారు
తుదకు పేదవానిని దండింపవస్తే
తమకేమి తెలియదన్నట్లు
తప్పుకొని తిరుగుతుంటారు

పేదవాడా ? నిరుపేదవాడా !!
పాడుపనులకు పాలుపడక
పాడిపంటలకు పాటుపడుచు

పశుపోషణకు కృషిని సల్పుచు
పసిడిపంటలు పండించుచూ
పస్తులేక జీవించుచుందుము.

కలవాడా ! సంపదకలవాడా !!
పాడుపనులను పేదలచే చేయించక
పాడిపంటలకు సహకరించి
పశుపోషణకు తోడుగ నీవుండి
పేదలకు అండగ నీవెప్పుడుండు
పాడిపంటలతో విరాజిల్లుచుండు.

## 22. కన్ను

జ్ఞానేంద్రియాలలో
కన్ను ప్రధానమైనది
కావుననే, కన్ను విజ్ఞానాన్ని
సమకూర్చి, విజ్ఞానవంతునిగా
విద్యార్జనకెంతగానో
దోహదమిస్తుంది.

కన్ను సాధించిన విజ్ఞానమువల్లనే
మానవుడెన్నో మన్ననలు పొందుతాడు.
కాని, కొంతరికజ్ఞానానికి
ఆధిక్యత వహిస్తుందదే కన్ను
మనకంటిలో అంతటి మహత్త్వమున్నది.

కళ్ళు లేనివానిని అంధుడంటారు
కళ్ళను మూర్ఖనియోగపర్చుకొనువారిని
కళ్ళుకావరం కలవారంటారు
కళ్ళను సద్వినియోగపర్చుకొనువారిని
విజ్ఞానవంతుడని, ఉత్తముడని అంటారు
కావున కళ్ళను సద్వినియోగపర్చుకొని
విజ్ఞానవంతునిగాను, వివేకవంతునిగాను
నిండుగ కనులకు కనబడుచుండు
పేరు ప్రతిష్ఠలతో ప్రజ్వరిల్లుచుండు.

## 23. ఉపాధ్యాయుడు

ఉపాధ్యాయుడా ! ఓ ఉపాధ్యాయుడా ! !
ఉత్తేజమొందు నీ వృత్తియందు
ఉత్సాహమొనర్చు విద్యార్థులందు
ఆర్జించు విద్యాధనము మెండుగా
బోధించు బోధనావిధానం నిండుగా

ఐకమత్యముగ నుండు
తోటి ఉపాధ్యాయులందు
కాలనియమమును పాటించు
కర్తవ్యము గుర్తించు.

]

## 24. ఎదిరిస్తా

ఎదిరిస్తా ! ఎదిరిస్తా ! !
అన్యాయాన్ని ఎదిరిస్తా !
అంటరానితనం
అమానుషమని పల్కుచూ-
పాటించుట చేతకాని
సమాజాన్ని ఎదిరిస్తా ! ఎదిరిస్తా ! !
మానవులంతా
సమానమంటూ
మనిషి, మనిషిని
దోచుకుతింటూ
కల్లబొల్లి కబుర్లు చెప్పెడి
నరరూప రాక్షసులను
ఎదిరిస్తా ! ఎదిరిస్తా ! !
వరకట్న నిషేధం
పాటించాలని పల్కుచూ
వక్రమార్గమున
వక్ర బుద్ధితో
కట్నం వసూలు చేయు
తల్లిదండ్రులను
ఎదిరిస్తా ! ఎదిరిస్తా
అన్యాయాన్ని ఎదిరిస్తా ! !

## 25. యువతరం

గ్రామాలలో పెద్దలు కొందరు
గందరగోళాలకు ప్రసిద్ధులు
మార్చాలి యీ పెద్దలను
మారు మాటాడనీయక
నేటి యువతరం !

యువతదానికి యువశక్తిని
భావితరానికి భవితవ్యాన్ని
నరనరాలకు నవోదయాన్ని
ప్రబోధించాలి ఈ నాటి తరం.
ప్రజల్లో మార్పు తేవాలి
ప్రజ్వరిల్లి పయనించాలి
ఈనాటి యువతరం
అదే యువతరానికి మహాబలం.

## 26. పేదవాడు

పేదవాడు ఈనాడు
పెదవి కదపలేకున్నాడు.
వెట్టి చాకిరి చేసినా
కడుపు నింపుకోలేకున్నాడు

కట్టు బట్టలే కరువు !
జుట్టుకు నూనెక్కడ ?

తల్లికే తిండికరువు
బిడ్డకు పాలెక్కడ ?

కరువుతోనే జీవితం
గడుపుతాము శాశ్వతం
కష్టాలు తీరేదెప్పుడు ?
కన్ను మూసినప్పుడా ?

## 27. సంక్రాంతి

సంక్రమిస్తాడు సూర్యుడు
దక్షిణాయనమునుండి
ఉత్తరాయణమునకు
సంక్రాంతినాడు
మకర సంక్రాంతినాడు

సంక్రమిస్తాయి సంపన్నులకు
సస్యసంపదలు సంక్రాంతినాటికి
కష్టజీవులకు కన్పించదేమినా
సంక్రాంతి సంబరం
కష్టజీవులకు కడుభ్రాంతి
సంపన్నులకే క్రాంతి సంక్రాంతి..

## 28. దీపావళి

దీపావళి పండుగ
దివిటీల పండుగ
సాటిలేని పండుగ
సరదాల పండుగ

దీపాలు వెలిగించి
దివిటీలు ముట్టించి
కనువిందు కల్గించి
కన్పించు నిండుగ

కళ్ళలో వస్తుంది
కఠినమని పిస్తుంది
డబడబామనిపిస్తుంది
డబ్బుదండుగ జేస్తుంది

నరకాసుర మరణం
ఈ పండుగకు స్మరణం
శ్రీకృష్ణుని సంకల్పం
సత్యభామ సాహసం
ఎఱుంగుటే సమంజసం.

# 29. వ్రాయాలని ఉన్నది

## రేడియో ప్రసారం 1986

వ్రాయాలని ఉన్నది
వ్రాయాలని ఉన్నది
కవిత వ్రాయాలని ఉన్నది
ఏమని వ్రాయాలో
దరితోచకున్నది
సరిగ కలమాడకున్నది

పేదవారి కష్టాలు
కార్మికుల నష్టాలు
కన్పించు చున్నవి
కడ తేర కున్నవి

నిరుద్యోగి నయనాలు,
యన్ జి వోల వయినాలు
ఊహించలేకున్నాను
ఊరుకోలేకున్నాను

అధ్యాపకుల అగచాట్లు
ఆఫీసర్ల అలవాట్లు
తెలిసికోలేకున్నాను
అలసి పోతున్నాను
ఎచ్చోట చూచినా మానభంగాలౌ
ఎచ్చోటగాంచినా దారిదోపిడీలౌ

ఏనోటవిన్నా మూకుమ్మడిహత్యలె
ఏమని వ్రాయాలి నేనేమని వ్రాయాలి ?
దండిగానే ఉన్నాయి ధాన్యాదులు మనకు
మండిపోతున్నాయి మార్కెట్టు ధరలు
ఎండిపోతున్నాయి పేదోళ్ళ పొట్టలు
నిండిపోతున్నాయి దళారీల కొట్లు
ఏమని వ్రాయాలి ! నేనేమని వ్రాయాలి ?

## 30. పేదల - ఆవేదన

చితికిన బ్రతుకులు
మా బ్రతుకులు
పూరి గుడిసెలె
మా బ్రతుకులకు
నిదర్శనాలు-

గంజి మెతుకులె
మాకు కాఫీ ఫలహారాలు
చినుగుపాతలె
మాకు చీనాంబరాలు

సేద్యం చేస్తాం
ఎంతో చక్కగా
నిత్యం ఏదోపని
చేస్తూనే వుంటాం

కష్టాలతో
చస్తూనే వుంటాం
ఎందుకొచ్చినదో
మాకీ పాడు బతుకు.

## 31. డ్రైవర్ ఆవేదన

ఓ బస్ డ్రైవర్
ఏమిటా నీరసం ?
సాగుతుందా చక్కగ
నీ ప్రయాణ సన్నాహం ?

ఏమని చెప్పుకోను
ఎవ్వరికని చెప్పుకోను ? !
ప్రమాదాలతోనే
కూడుకుంది
నా ప్రయాణం సన్నాహం
రోడ్డు ప్రక్క గుట్టలాయె
గజంలోతు గుంటలాయె
పైకిలేచి పయనించె
రాళ్ళ పిక్క లెక్కువాయె ?
తాడుకోడైనా !
కంకఱుకోడైనా ! !

తోసుముకుంటూనే
పోతున్నా-

వచ్చిపోయే వాహనాల్ని
తప్పుకుంటూ పోతుంటే
అడ్డుతుంది రైలుగేటు
పావుగంటో ! అర్ధగంటో ! !

బస్సెక్కినోళ్ళు ఎక్కినట్టే
నానెత్తిమీద కెక్కుచుండె
అటో యిటో పొమ్మంటే
ఎగాదిగా చూస్తుండె

కండక్టరు మాటైనా
లెక్క చేయరెవ్వరు
బస్‌లోని వారైనా
పట్టించుకోరెవ్వరు !

ఊరికెన్నో స్టాపులాయె
ఆపకుంటె చెల్లదాయె
చెక్కింగు లెక్కువాయె
సకాలంలో చేరమయ్యో !

ఏమని చెప్పుకోను
నా బాధలు నీతోను,

# 32. కండక్టరు బాధలు

ఓ బస్ కండక్టర్
ఆలోచిస్తూన్నావేమిటి ?
సాగుతుందా చక్కగ
ప్రయాణ సన్నాహం !

ఏమని చెప్పుకోను
ఎవ్వరికని చెప్పుకోను
కండక్టరుకున్న బాధ
కన్పించదెవ్వరికి-

ఎక్కినోళ్ళెక్కినట్టె
సీట్లకొఱకే అన్వేషణ
శ్రద్ధచూపరాయె
ఏ ఒక్కరూ టిక్కెట్టుపైన

టిక్కెట్ టిక్కెట్ అంటేచాలు
పెద్దనోట్లు తీస్తారు
ఎక్కడనుండి తెస్తాం
అంత చిల్లరందరకు

చుట్టా, బీడి, సిగరెట్లు
దట్టంగా లాగుతారు
కాల్చకూడదంటె చాలు
కోరచూపు చూస్తారు

ఐదేళ్ళ పిల్లలకు
నాలుగేండ్లే చెపుతారు
నమ్మండి నాలుగేండ్లేనని
నానామాటలాడుతారు

అరగోనెల సంచులెన్నో
అడ్డుగానే పెడతారు
అదేమంటే చాలు
అడ్డులేదెవ్వరికంటారు
లగేజి కొట్టబోతేచాలు
ఎందుకూ !! లగేజి
ఎంతుందీ బరువని
ఏమేమో అంటారు

లేస్తైతే చాలు బస్
ఇంత లేటెందుకంటారు
ఎవ్వరికని చెప్పుకోను
నాకున్న బాధలు
కన్పించదెవ్వరకు.

## 33. పరిష్కారం

కూడు గుడ్డలేక కుమిలిపోతూ
నిలువనీడలేక కమిలిపోతూ
పనిచేయ శక్తి నశియించి

స్త్రీహత్యే పడిపోయిన నడవడను
పలుకరించ దెవ్వరతని
కాము గుడ్డకు లోబడేసినాడు
నిలువనీడ కల్గినోడు
మద్యపానాదులు మత్తుగ సేవించి
కన్న పిల్లల చెలిమికోరి
కన్నూ మిన్నూ కానకతను
క్రూరకర్మలు చేయుచుండ
వావినోళ్ళు వ్రారకుండక
ప్రోత్సహిస్తారెందరో !
ఏమిటీ ఘోరం ?
దీని కేమిటీ పరిష్కారం?

## 34. అసహ్యం

పశువుల్లో పశుత్వం
మానవుల్లో మానవత్వం
కన్పించుట సహజం
ప్రస్తుత పరిస్థితుల్లో
పశుజాతి తత్వం
పరికించిన ప్రమోదం
నరజాతి తత్వం
ఆలోకింప అసహ్యం

## 35. రైతు బాధలు

రవికిరణాలకు ఓర్పువహించుచూ
చలిగాలులను చవిచూచుచూ
అతివృష్టికి ఆత్రుతచెందుచూ
అనావృష్టికి ఆక్రోశిస్తూ
కండలు కరిగించి పసిడిపంటలు
పండించాలని రైతు అప్పులెన్నో చేసి
పంటకు పెట్టుబడి పెట్టుచుంటె
క్రిమికీటకాదుల బాధలెక్కువై
పంటఫలితము దక్కదాయె ?
క్రిమిసంహారిణి మందులు
కించిత్తైన పనిచేయకుంటె ! ?
రైతు ఏమందని కొట్టగలడు ?
అతడెంతని అప్పుచేయగలడు ?
యిక యెంతని ఖర్చుపెట్టగలడు !
తానే విధముగ కోల్కొనగలడు ? !

## 36. బాలగేయం

తెలుగుజాతి బిడ్డలం
వెలుగులాగ వెలిగెదం
చక్కగ మా చదువు చదివి
చెలిమికోరి మెలిగెదం

సమత మమత పెంచెదం
హితుల చెంతనిలిచెదం
సత్యమునే పల్కెదం
ధర్మమునే కోరెదం

తల్లిదండ్రులందు మేం
గౌరవముగా ఉండెదం
గురువులన్న, పెద్దలన్న
భయభక్తులతో మెలిగెదం

## 37. విన్నారా యీమాట

రేడియో ప్రసారం 1986

నియంత్రణ నియంత్రణ
కుటుంబ నియంత్రణ
పాటించవలె ప్రతిఒక్కరికి
కుటుంబ నియంత్రణ

ఒక్కరైతే ముద్దు
ఇద్దరకు మించివద్దు
ఒద్దికగా వుండాలంటే
ఇద్దరివరకే హద్దు

చిన్న సంసారమే మనకు
వన్నె తెచ్చును తుదకు
విన్నారా యీ మాట

ఇపుడెంతో హాయి
కాదన్నారా ? మన బ్రతుకు
కడదాక కడగండ్లేనోయి.

## 38. క్రిస్మస్

క్రీస్తు జననమే
క్రిస్మస్ పండుగ
క్రైస్తవులకిది
ముఖ్య పండుగ

జన్మించె క్రీస్తు
బెత్లెహేమందు
కన్య మరియ
గర్భ మందు

తార వెలసె
ఆకాశమందు
ప్రత్యేక కాంతితో
ప్రజ్వరిల్లె-

కాపరులు, జ్ఞానులు
ఆ తారను గాంచి
చూడగా వచ్చిరి
బాల యేసును

భక్తితో జ్ఞానులు
కానుకగా యిచ్చిరి
బంగారు, సాంబ్రాణి
బోళాలు ఆ రాత్రే

క్రీస్తు బోధలు
ఖ్యాతి చెందెను
ప్రపంచ వ్యాప్తిగా
క్రాంతి చూపెను

భక్తితో ప్రార్థనలు
జరుపుకొంటారు
క్రైస్తవు లందరు
చర్చికి వెళ్ళి

## 39. యన్. జి. వో. నేస్తం !

యన్ జి వో నేస్తం !
ఎక్కడుంది న్యాయం
ఎక్కడుంది ధర్మం
ఏమిటీ మన ధ్యేయం !

నష్కాలోడు పెంచుకోక
ఆఫీసరుచే మాటపడక
ఏరోజుకారోజే
మనపని నెరవేర్చుదాం !

పన్ను మీద పన్ను లెన్నో
అధికమయ్యె నేడు మనకు
పాలు, పెరుగు, వెన్నలు
ఇంటిలోన కరువయ్యె

భారమయ్యె ధరవరల్
బిడ్డలేమో బరువయ్యె
భారమయ్యె బ్రతుకని
బాధ్యతలను మరువరాదు

అందరకూ వుంటాయి
మనవలె బాధలు
బాధలు గుర్తించి
బాధ్యతలు నెరవేర్చుదాం !

## 40. పేకాట

పేకాటలో పోగొట్టుకొన్న సొమ్ము
రాబట్టుకోవాలని కొందరు
స్నానపాన నిద్రాహారాలు మాని
రాత్రింబవళ్ళు పట్టుదలతో
చెడబట్టువరకు ఆడుతుంటారు

పోయిన సొమ్ముపోగా !
ఉన్న సొమ్ముకాస్త పోగొట్టుకొని
కంట తడిబెట్టలేక
కంటికి నిదురబట్టక
కటిక దరిద్రం వహిస్తూ
కన్న తల్లిదండ్రులపై
కత్తి చూపించి
ఉన్న ఆస్తికాస్త అమ్మమంటారు
లేదా, నా ఆస్తినాకు పంచమంటారు

తల్లిదండ్రులు ససేమిరాంటే
కట్టుకున్న భార్యపై విరుచుకుపడి
తాళిబొట్టునైనా తాకట్టుబెట్టి
తమకు డబ్బివ్వమంటారు, లేదా
నీ బొట్టుకాస్త చెరిగి నష్టేటిలో
మునగవలసి వస్తుందంటారు

కట్టుకున్న భార్య, భర్తబాధలు
తట్టుకోలేక కోపముతో
పుట్టింటి కెళితే
తమకేమి బాగులేదని
త్రాగ మొదలిడి
తమ బ్రతుకుతామె
బద్దలు చేసుకుంటారు

పేకాటెందుకు ?
త్రాగుడెందుకు ?
బ్రతుకు బద్దలు
చేసుకొనుటెందుకు ?
ఉన్న ఆస్తితో
ఊరట చెంది
కన్న తల్లిదండ్రులను
కట్టుకున్న భార్యను
కన్నబిడ్డలను
కంటికి రెప్పలా
కాపాడు కొంటూ
పోషించుకోలేరా !
కష్టపడి పనిచేసి
సంపాదించుకోలేరా ! ?

## 41. మానవుడు – మృత్యువు

మానవుడు :-

మృత్యువా ! మృత్యువా ! ఓ మృత్యువా
నిన్నుస్మరించినచో నాకు భయం
నీవు నాదరి చేరనున్న నాకు భయం
నేను నీదరిచేరాలన్నా నాకు భయమే !

నీవు నన్ను వెంటాడుచునే ఉంటావు
నేను నిన్ను తప్పించుకోను ప్రయత్నిస్తాను
ఎంతకాలం నను వెంటాడుతావు
నేనెంతకాలం నిను తప్పించుకోను !

మృత్యువు :-

మానవుడా ! మానవుడా ! ఓ మానవుడా
నిభ్రాంత తలవ్రాత ఒక్కటేకదా !
ఆ వ్రాతలకంటే కుత్సితునివాత
కుటిలమైనదని గ్రహించవెందుకు
నన్ను తలంచి నీవు భయపడవద్దు
నికై నీవు నాదరి చేరవద్దు
నాకంటే కుత్సితుడే భయంకరుడు
వానినే ఓకంట కనిపెట్టి నీవుండు.

## 42. వ్యసనం

వ్యసనాలెన్నో వుంటాయి
మానవాళికి సహజంగా
అవి ఏవో ! ఎన్నెన్నో ! !
తెలిసికోలేకున్నాము

మనిషికొక వ్యసనముంటుంది
మనిషిలో ఓ మంచంటూ వుంటుంది
వ్యసనానికి బానిసగాక

వ్యక్తిగతముగ మంచి వ్యక్తిగ
వ్యవహారమునకు మంచి వక్తగ
వ్యవహరించు నిండుగ నీవెప్పుడు.

## 43. గుర్తుంచుకో !

వ్యర్థముగ మనిషిని
తూలనాడ నెంచకు
అర్థము చేసికో
మనిషిలోని మంచిని

సర్దుబాటు మనిషికి
అన్నివిధాల అవసరం
సమస్యలెన్ని వున్నా
సావధానాలతో పరికించు
సమస్యలను పెంచుకోకు
సామరస్యమును చంపుకోకు.

## 44. అధోగతి

అధములకు పెత్తనమిచ్చినచో
అధోగతి పాలవ్వక తప్పదు
అంధకార బంధురములో ఎవ్వరైన
అధములకు పెత్తనమిస్తే
తప్పదు అధోగతి.

ఉత్తము లెవ్వరో !
అత్యుత్తము లెవ్వరో ! ?
అధము లెవ్వరో
ముందుగా గుర్తించు
అత్యుత్తములకే
పెత్తనమిచ్చి హాయిగావుండు
అధములకు పెత్తనమిచ్చి
అధోగతి పాలవ్వకు.

## 45. మార్పు

కన్నుమిన్ను కానకుండ
నిన్ను నన్ను చూడకుండ
వెన్నుపోటు పొడుచువాడు
నిన్న నేడు కాకున్న
కొన్నినాళ్ళకైన వాడు
దొరకకుండునా ? !
తన తప్పు తాను
తెలిసికొనకుండునా ?
తనలోన మార్పురాకుండునా ! !
మార్పు వచ్చేనేని
చిత్తశుద్ధి కలిగి
భక్తి కొఱకు భువియందున

శక్తి కొలది పాటుపడుచు
ఎనలేని విషయాలు
విన్నవించుకొనును
నిన్ను, నన్ను గాంచిననాడు
అదియే ! తనలోని మార్పునకు
జీవాంకుర బీజమాను.

## 46. రంజాన్

రంజాన్ పండుగ
రంజైన పండుగ
ముస్లిం సోదరులకు
ఇది ముఖ్య పండుగ

పాపభీతితోను
ఉపవాసాలతోను
ఆ నెలంతా మసీదుకెళ్ళి
ప్రార్థనలు చేస్తారు
రంజాన్ నెలలో
ఖురాన్ వెలసెనని
అల్లాను ప్రార్థిస్తూ
దానధర్మాలు చేస్తారు

ఈద్ కు వెళ్ళి
ప్రార్థనలు సల్పి
ఆలింగనాలతో
తెల్పుకుంటారు.

"శుభాకాంక్షలు ఈ పర్వదినం"

## 47. ఏ శక్తి గొప్పది

మంత్రశక్తి గొప్పదా ?
దైవభక్తి గొప్పదా ?

మంత్రశక్తి గొప్పదని
మాంత్రికుడు
దైవభక్తి గొప్పదని
దైవ భక్తుడు
వాదోపవాదాలకు దిగుతారు

మంత్రశక్తి యిహమందె
దైవభక్తి యిహపరములందు
గొప్పగా కొనియాడబడుచు
చెప్పుకో తగినట్లు చేస్తుంది

మిత్రమా ! ఓ మిత్రమా ! !
మంత్రశక్తి నేర్చే మాంత్రికుడవుగాక
దైవభక్తితో దేవుని ధ్యానించి
దైవాశీస్సులతో ధన్యుడవుకమ్ము.

## 48. పరివర్తన

న్యాయం కొరకు పోరాడుదాం
అన్యాయాన్ని అంతంచేద్దాం
కులమత భేదము లేకుండా
కలిసికట్టుగా మనముందాం

ప్రగతి పథంలో పయనించమని
ప్రతివారికి ప్రబోధించుదాం
కుటుంబ నియంత్రణ అవశ్యమని
ప్రతివారిలో పరివర్తన తెద్దాం.

## 49. ఓటు విలువ

అధిక సంపన్నుడు డబ్బు వెచ్చించి
ఓట్లెన్నో కొని విజయమొందు, కాని
అందరి మన్నన లొందనేరడు
ఎందుకో తెలుసా ! ?

తాను వెచ్చించికొన్న వోట్ల డబ్బు
తిరిగి సంపాదించాలని
ప్రజలను మభ్యపెట్టి
మోసాలెన్నో చేస్తాడు

]

ఆ మోసాలన్నీ తెలుసుకొన్న వారెందరో
అతనికి వోటువేసి గెలిపించినందుకు
తమకు తామే నిందించుకొంటూ
దోషులము మనమేనని బాధపడతారు

బాధపడుటెందుకు ? !
ఓటెవ్వరికి వేయవలెనో తెలియదా ? !
తెలుసు. కాని డబ్బే ప్రధాన కారణం
అందుకే డబ్బు గడ్డి తినిపిస్తుందంటారు

కావున, నీ వోటును నీవెప్పుడైనా
సద్వినియోగపర్చుకొనవలెనన్న
గెలిపించవద్దు నీవెప్పుడు
అలాంటి దుష్టులను.

## 50. సుఖయాత్ర

నడిచానడూ నీతిగనడూ
నిలూనిలూ నీతిగనిలూ
నలుగురిలో నీతిగ నిలబడూ
నీలోని నిజాయితీని నిరూపించు
మంచిని ప్రేమించి మనుగడను పెంచు
ఇదే నీకు మంచి యాత్ర
జీవితానికిదే సుఖయాత్ర

## 51. అన్నా ! అంబేద్కర్

అన్నా ! అన్నా !! అంబేడ్కర్ అన్నా !!!
డాక్టరు బి. ఆర్. అంబేడ్కర్ అన్నా !
భారత రాజ్యాంగ చట్ట నిర్మాతగా
భావితరానికి బాట చూపావన్నా !

అస్పృశ్యత నిన్నెంతో క్రుంగదీసినా
నిస్పృహ జెందక నీవు నిలిచావన్నా
భారతజాతి నీకెంతో బాకీపడినదన్నా
భావితరం నిన్నుగుర్తించే రోజు వచ్చిందన్నా

గ్రంథాలెన్నో వ్రాసి ఘనతకెక్కావన్నా
భారతమాత పుత్రునిగా, భారతరత్నగా
పదవులెన్నో చేపట్టావన్నా
మరువలేము ! మరువబోము !!
మీ ఆదర్శ జీవితమన్నా !

## 52. మహిళ

అబలకాదు మహిళ
సబలని చాటిచెప్పు మహిళా !
వెనుకంజ వేయకు మహిళా
ఎలుగెత్తి చెప్పు మహిళా !

కార్మికులున్నారు మహిళలలో
కర్షకులున్నారు మహిళలలో
కార్మిక కర్షక మహిళలు
కోట్లాల్లలుగ ఉన్నారని ఇలలో
చాటిచెప్పుమా మహిళా
ఎలుగెత్తి చెప్పుమా మహిళా !

పండితులున్నారు మహిళలలో
కవయిత్రులున్నారు మహిళలలో
రసవత్తరముగ రచనలందించువారు
ఎందరెందరో ఉన్నారని
చాటిచెప్పుమా మహిళా !
ఎలుగెత్తి చెప్పుమా మహిళా!

అబలకాదు మహిళ
సబలని చాటిచెప్పు మహిళా
ఎలుగెత్తి చెప్పుమా మహిళా
వెనుకంజ వేయకు మహిళా.

## 53. మనిషి

మనకెన్నో మతాలున్నాయి
అన్ని మతాల సారాంశం ఒక్కటే
ఎవ్వరు చెప్పినా ! ఏ మతం చెప్పినా !!
సత్యం - ధర్మం - అహింసలు

పవిత్ర ధర్మాలని
ప్రధానమైనవని-

అన్ని మతాలలోని సారాంశాన్ని
అవగాహన చేసుకొని
అన్ని మతాలను ఆదరించినవారే
మంచి మనస్సు గలవారు
మనిషిని మనీషిగా
గుర్తించగలవారు
మనిషి "మనిషి"గ
మణిరత్నంగా
వెలుగొందగలవారు.

## 54. ఎవ్వరైతేనేం!

భార్యాభర్తలకే వస్తుంది విభేదం
భారీ ఎత్తుగ భలెగమ్మత్తుగా
మగపిల్లలపై మక్కువ ఎక్కువ
ఆడపిల్లలపై తక్కువ మక్కువ
చూపిస్తారెక్కువ తక్కువలు
భారీఎత్తుగ భలెగమ్మత్తుగా-

మగవారు కొందరు ఆడపిల్ల జన్మిస్తేచాలు
ఆలినే ఎడబాసి మగబిడ్డకొఱకై

మరో మనువాడి అవస్థలెన్నో పడుతారు
ఎవ్వరైనా ఒక్కటే ! ఎందుకా ఎడబాటు
ఎందుకా అవస్థల పాలగుట ?
ఒక్కరిద్దరే చాలు ఎవ్వరైనా
లోటుండదెందున.

## 55. కయ్యము - వియ్యము
### రేడియో ప్రసారం 1986

కయ్యానికి కాలుదువ్వుతారు కొందరు
వియ్యానికి విందుచేస్తారు మఱికొందరు
కయ్యానికి కాలుదువ్వి
కన్నులొట్ట పోగొట్టుకోనకు
వియ్యానికై విందు జేసి
నెయ్యాన్ని పెంపొందించు

కొట్లాటుకు పోయి నీవు
కోర్టుదాక వెళ్ళబోకు
కోపాన్ని తగ్గించి
లోపాన్ని గుర్తించు

వియ్యానికై విందుచేసి
కయ్యాన్ని పెంచుకోకు
చెంతచేరి చెలిమికోర
చెందుతుంది చెలిమినీకు

దెప్పిపొడుపు మాటలెపుడు
చెప్పబోకు చేటువచ్చు
గొప్పలెన్నో జెప్పుకొని
తిప్పలెన్నో బడబోకు

కప్పిపుచ్చుకోకు తప్పులున్న-
నిప్పువలె నిజమునే జెప్పుమన్నా !

## 56 పిశాచమా

పిశాచమా ! పిశాచమా ! !
ఓ వరకట్న పిశాచమా ?
వీడిపో ! వీడిపో ! !
మానుండి వీడిపో ! !

కట్నాలు తేలేదని
కలహాలు రేపుకొని
కాపురం కూల్చుకొనెడి
కఠినాత్ములనుండి వీడిపో !

కట్నాలు తెచ్చామని
కన్నుమిన్ను కానని
కొందరి అహంకారం
కాంచలేకున్నాము

ప్రేమానురాగమే
ప్రియమైన బంధమని
సంసారమే స్వర్గసీమని
ప్రబోధించుచున్నారు
ఎందరో మహానుభావులు

పిశాచమా ! పిశాచమా
ఓ వరకట్న పిశాచమా
వీడిపో వీడిపో
మానుండి వీడిపో

## 57. వెల్గుచుందుము

పూజించు గురుదైవములను
సేవించు తల్లిదండ్రులను
గౌరవించు పెద్దలను
ప్రేమించు భార్యాబిడ్డలను
ఆదరించు బంధుమిత్రులను

దుష్టుని మాటలవలన
కష్టముల పాలవ్వక
మూర్ఖుని మాటలవలన
మార్గము తప్పిపోక
నిండుగ వుండాలన్న

అండగ పెద్దలతోనుండ
గండములు తప్పుచునుండు

కండబలమున్నదని
దండలు వేయించుకోకు
దండలు వేసినవారే
దండన చేతురొకప్పుడు !

కండ బలము కన్న
అండ బలము మిన్న
కల్ల మాటలకన్న
సత్యవాక్కులు మిన్న.

## 58. ఆత్మ సౌందర్యం

అందమైన అంగసౌష్టవముతో
అందముగ జన్మిస్తారు కొందరు
అంగవైకల్యము కలిగినసూ
సౌందర్యముగా జననమెదుదురు కొందరు

అంగవైకల్యము కలగిననూ
సౌందర్యముగా వర్తించువారున్నారు
సౌందర్యముగా జన్మించిననూ
సౌందర్యహీనముగా కన్పిస్తారు మఱికొందరు

అందముకాదు ప్రధానము మనిషికి
కన్పించని ఆత్మవున్నది ప్రతిమనిషికి
ఆ "ఆత్మను" సౌందర్యముగా ఉంచుకో
పవిత్రముగ పదిలపర్చుకో.

## 59. తెల్లారిందా

(రేడియో ప్రసారం 4-1-87)

తెల్లారిందా ! తెల్లారిందా ! !
అప్పుడే తెల్లారిందా !
చుక్కెప్పుడు పొడిచింది
కోడెప్పుడు కూసింది

చుక్కల్ని తరిమేసి
సూరీడు వచ్చాడా !
వెలుగునే తెచ్చాడా
లోకానికి పంచాడా ! !

చిరుగు పాతలతోను
చీకు చింతలతోను
చితికిపోతున్న - ఈ
నిరుపేదకు కూడా
తెల్లారిందా తెల్లారిందా
అప్పుడే తెల్లారిందా !
పసివాని రోదన
పేదవాని ఆవేదన

ఎదలోని బాధలు
ఎన్నాళ్ళు యీ పేదకు ?
పేదోడి జన్మకు
పెన్నిధి యెప్పుడు ?
పేదోళ్ళ బ్రతుకులు
తెల్లారేదెప్పుడు ?
తెల్లారిందా తెల్లారిందా
అప్పుడే తెల్లారిందా ? !

## 60. కవి కలం

కవికి రెండేకళ్ళున్నా !
కవికలానికెన్నో కళ్ళు
రవి ఒక్కడైనా రవికిరణాలెన్నో !
కవులెందరో వారిభావాలెన్నెన్నో ! !
"రవికాంచనిది కవికాంచునని"
మహానుభావులెందరో అన్నారు !
రవికాంచని దేనినైనా సరే
కవి కాంచుననే కదా అర్థము !
అందువల్లనే ఈనాడు
కవికలానికెన్నో కళ్ళని
అంటున్నాను నేను-

కవిని మించినవాడు
కవి అని గుర్తించాలి
కవికి, కవికలానికి
ఎల్లకాలం విలువివ్వాలి.

## 61. హత్యలు

పూర్వం హత్యలు
పరోక్షముగ జరిగేవి
ప్రస్తుతం హత్యలు
ప్రత్యక్షంగానే జరుగుచున్నవి
ఏమిటీ హత్యలు ?
ఎందుకీ హత్యలు ! !
మార్పులేదా మనసమాజంలో !
మార్చలేమా మనసమాజాన్ని ?
ఎవ్వరికివారు పట్టించుకోనకుంటె
పతనమైపోతుంది మనసమాజం
పట్టించుకోవాలి ప్రజలే
ప్రభుత్వ సహకారంతోనైనా !

## 62. గురుపూజోత్సవం

నేడే "సర్వేపల్లి" జన్మదినోత్సవం !
ఈనాడే గురుపూజామహోత్సవం !

గురుతర బాధ్యతల గుర్తింపుదినం !,
గురువులకొక పర్వదినం !!

అధ్యాపకుడుగాను, ఆచార్యుడుగాను
రాయబారిగాను, రాష్ట్రపతిగాను
రాణించిన మనరతనాల రాశి
జన్మదినోత్సవం నేడే ! ఈనాడే !!

"భారతీయ తత్వశాస్త్రాన్ని"
బహుచక్కగ రూపొందించి
విదేశాలలో ఉపన్యసించి
వివేకవంతుడనిపించారు

రష్యాధినేత "స్టాలిన్ చే"
బ్రిటీష్ ప్రధాని "చర్చిల్ చే"
గుర్తింపు పొందిన ఘనుడు
గురువులలో పూజనీయుడు

ఉపరాష్ట్రపతిగా పదివత్సరాలు !
రాష్ట్రపతిగా ఐదువత్సరాలు !!
పరిపాలనాధ్యక్షునిగా ప్రశంసలొందిన
"ప్రతిభావంతుడు" మన రాధాకృష్ణన్

"రాజనీతి విశారదుడని
బహుముఖ పండితుడని"

కొనియాడబడిన మన సర్వేవల్లి
జన్మదినోత్సవం నేడే సెప్టెంబరైదు !

## 63. కవిచక్రవర్తి

నవయుగ కవిచక్రవర్తి
శ్రీ గుర్రం జాషువా కవి
కవులకొక చక్రవర్తి
గుర్తింపుగల వ్యక్తి
"కవికోకిలన్న" బిరుదు
కవులకొక మలుపు
కవినేస్తాలకు పిలుపు
కవికలాలకు మేలుకొలుపు

కవిచక్రవర్తి కీర్తి మకుటం
చరిత్రపుటల్లో లిఖితం
ప్రజల హృదయాలలో కథనం
కవుల కలాలలో మథనం

అస్పృశ్యతనెడి జాడ్యం
అనాడొక పెనుభూతం
ఎదుర్కొన్నారీ భూతాన్ని
అందించారెన్నో కావ్యాల్ని

మధురం మధురం
మధురాతి మధురం
కవి కధనం మధురం
కవి వదనం మధురం

కవికలం మిన్న
కవినిలయం చిన్న
కవి హృదయం వెన్న
కవి సంపద సున్నా

జరుపుకుందాం మనం
ప్రతి సంవత్సరం ఈ ఉత్సవం
కవి జన్మదినోత్సవంగా ! !
జగతిలో మహోత్సవంగా ! !
సెప్టెంబరు ఇరువది ఎనిమిది
చెరిగిపోదండి మనమదినుండి
గుంటూరుజిల్లా ప్రతినిధులనుండి
కవులకలాల మధుర గీతికలనుండి

(శ్రీ గుర్రం జాషువాకవి 97వ జన్మదినోత్సవ
సందర్భముగా 28-9-92 న వ్రాయబడినది.)

# 64. విధి నిర్వహణ

నిర్వహించవలె ఎవరివిధివారు
విధినిర్వహణయే ఘనతకు మార్గము
విధి నిర్వహణలో శ్రద్ధ చూపుచూ
విధేయుడవై పెద్దలందుండు
సత్కరించబడెదవు నీ విధి సఫలమై
చెప్పుకొందురు నీ ఘనతను ఘనముగ.





# నా వృత్తాంతము



: రచయిత :

వల్లభాపురం నా స్వగ్రామం
మంచికలపూడి నా జన్మస్థలం
వల్లభాపురపు ఇంటి నామం
దేవదాసం నా నామధేయం

మరియమ్మ, జకరయ్యగార్లు
నాకు జన్మనిచ్చిన తల్లిదండ్రులు
నాగరత్నం, రాబర్టుగార్లు
నాకు వధువు నిచ్చిన అత్తమామలు

వల్లభాపురపువారు నా యింటివారు
వల్లమాలిన అభిమానమున్నవారు
కొండముదివారు నా అత్తవారు
కొండంత బలగమున్నవారు.